# అశ్రువీధిలో అగ్నిగానం

## కవితా సంపుటి

అడిగోపుల వెంకటరత్నము

ప్రథమ ముద్రణ : జూలై, 1991

ప్రతులు : 1,000

ముఖచిత్రం : బాపు

**వెల : రు. 10-00**

ముద్రణ :

ప్రజాశక్తి ప్రెస్

విజయవాడ-520 002

ప్రతులకు :

**ప్రజాశక్తి బుక్ హౌస్**

కారల్ మార్క్స్ రోడ్

విజయవాడ - 520 002

రచయిత :

అడిగోపుల వెంకటరత్నమ్

నాగార్జున యూనివర్శిటి

గుంటూరు - 522 510

అడిగోపుల వెంకటరత్నమ్

---

యస్వీ భుజంగరాయశర్మ
కావలి
నెల్లూరుజిల్లా

# ముందు మాట

సమాజం మనుషుల సమూహంకాదు. సమాజం మారాలంటే వైయక్తి కంగా మనుషులు మారాలని నమ్మేవారే సమాజమంటే మనుషుల సమూహమనుకుం టారు. సమాజంలోని ప్రతిమనిషీ మారటం జరగదుకాబట్టి వారి అవగాహన ప్రకారం సమాజం మారే అవకాశం ఎప్పటికీ వుండదు.

మనుషులు తమ మనుగడకు ముఖ్యంగా మూడు సంబంధాలు పెట్టు కుంటారు.

తాను బతకటానికి అవసరమైన ఆహారంగానీ, తానుపయోగించే వస్తువుల తయారీకి కావలసిన ముడిసరుకుగానీ భూమినించే వస్తాయికాబట్టి అతడు భూమితో సంబంధం పెట్టుకుంటాడు. భూమి అంటే పొలాలూ, బయళ్ళూ, కొండలూ, నదులూ, అడవులూ, సముద్రాలూ లాంటి వన్నీ అని అర్థం.

అయితే, భూమినించి ఆహారం పండించుకోటానికిగానీ, గనులనించి ఖని జాలు తవ్వితీయటానికిగానీ, తీసిన ఖనిజాలతో వస్తువులు తయారు చేసుకోటానికిగానీ అతడికి ఇతరుల సాయం అవసరం. అందుకోసం అతడు ఇతరులతో సంబంధం పెట్టుకుంటాడు.

సంతానం కని స్వజాతిని వృద్ధి చేసుకోటం అన్ని ప్రాణులకూ సహజ మైన గుణం. అందువల్ల మనిషి కూడా సంతానం కోసమైన సంబంధం పెట్టు కుంటాడు.

ఈ మూడూ మనుషులు సహజంగా మౌలికంగా పెట్టుకునే సంబంధాలు తమ మనుగడ కోసం.

ఇవికాక మతపరంగానో, రాజకీయపరంగానో, సంస్కృతిపరంగానో వారెన్నో రకాల సంబంధాలు పెట్టుకుంటారు. కాని అవి పై మూడు సంబంధాల్లా వారు బతకటానికి అనివార్యమైన అవసరాలు కావు.

వారి మనుగడకు అవసరాలు కానంత మాత్రాన అవి విలువలేనివని అర్థంకాదు. సౌందర్య దృష్టి, తత్త్వచింతన లాంటివెన్నో మనిషి అనేక కళలూ, శాస్త్రాలూ నిర్మించుకోటానికుపయోగపడ్డాయి. కాని, కడుపు నిండాకనే మనిషి వాటిని నిర్మించుకోగలడనీ మనం గుర్తించాలి. గొప్ప విలువలేవీ ఆకలి ముందు నిలవలేవని భగవద్గీత, బ్రహ్మసూత్రాలూ రాసిన వ్యాసుడే అనుభవం వల్ల తెలుసుకున్నాడు.

అందువల్ల – సమాజమంటే మనుషులు తమ మనుగడకు ఏర్పరుచుకున్న సంబంధాల సమాహారమని అర్థం చేసుకోవాలి.

సమాజం మారటమంటే ఆ సంబంధాల స్వరూపం మారటమని కూడా అర్థం చేసుకోవాలి.

అయితే – యీ మూడు సంబంధాల్లో మొదటి రెండూ – అంటే, ఉత్పత్తి సాధనమైన భూమితో వున్న సంబంధం, భూమినించి సంపద సృష్టించటానికి ఇతరులతో పెట్టుకున్న సంబంధం – చాలా కీలకమైనవి. ఈ వాస్తవాన్ని గ్రహించటం కష్టంకాదు.

భూమి కొద్దిమంది చేతుల్లోనే వుండటమూ, భూమిలోంచి ఆహారం పండించటానికిగానీ, వస్తువులు ఉత్పత్తి చెయ్యటానికిగానీ చాలామంది శ్రమించటమూ అందరికీ తెలుసు.

ఈ కొద్దిమందీ – చాలామందికి చాలీచాలని బ్రతుకులు గడపటానికి సరిపడ్డ ప్రతిఫలం ముట్టచెబుతూ ఆ 'చాలామంది' శ్రమ ఫలితాన్ని అనుభవించటం కూడా అందరికీ తెలుసు.

అడిగోపుల వెంకటరత్నమ్

---

ఈ వాస్తవం చూడలేని వాళ్ళెవరైనా వుంటే వాళ్ళు కళ్ళులేని వాళ్ళైనా యివుండాలి, లేదా కావాలని కళ్ళుమూసుకున్న వాళ్ళైనా అయివుండాలి.

ఉత్పత్తి సాధనాలైన పొలాలూ ఫ్యాక్టరీల్లాంటి వాటిని చేతుల్లో పెట్టుకున్న కొద్దిమందీ సహజంగానే ఐశ్వర్యవంతులవుతారు. ఆ పొలాలూ ఫ్యాక్టరీల్లాంటివాటికో పనిచేసే చాలామంది దరిద్రులుగానే వుండిపోతారు.

ఆ కొద్దిమందీ—ప్రభుత్వం నడుపుతారు, అధికారం చెలాయిస్తారు, చట్టాలు చేస్తారు, సైన్యాలు పోషిస్తారు, తుపాకులుపయోగిస్తారు.

చరిత్రకు తెలిసినప్పటినించీ సమాజం మౌలికంగా యిలాగే వుంది.

ఈ సామాజిక స్వరూపాన్ని ఈ రచయిత అవగాహన చేసుకున్నాడనటానికి ఈ కావ్యంలోనూ ఇంతకుముందు రాసిన కావ్యాల్లోనూ దాఖలాలున్నాయి.

అంతేకాదు,

ఈ సమాజాన్ని మార్చటానికి రచయితగా తనకున్న బాధ్యతను గుర్తించటానికి కూడా దాఖలాలు అన్ని కావ్యాల్లోనూ కనబడతాయి.

చదివి చూడండి.

మీకే తెలుస్తుంది.

-3-1991 — యస్వీ భుజంగరాయశర్మ

ముఖచిత్రం వేసిన బాపుగారికి...
ముందు మాట వ్రాసిన ఆరుద్రగారికి, యస్వీ భుజంగరాయశర్మగారికి...

ఈ కవితల్ని ప్రచురించిన ఆంధ్రప్రభ దినపత్రిక, ఆంధ్రప్రభ వారపత్రిక, ఆంధ్రపత్రిక దినపత్రిక, ఆంధ్ర సచిత్రవారపత్రిక, ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆంధ్రజ్యోతి వారపత్రిక, ప్రజాశక్తి దినపత్రిక, విశాలాంధ్ర దినపత్రిక, భారతి మాసపత్రిక, స్రవంతి మాసపత్రికాధిపతులకు......

సాహిత్యంలో ప్రోత్సహిస్తున్న అద్దేపల్లి రామమోహనరావుగారికి, రాధామనోహరన్‌గారికి......

నా కృతజ్ఞతలు.

— రచయిత

# ఇందులో

# నా దగ్గర ఓ అస్త్రం వుంది

పిల్లకాకి కేం తెలుసు ఉండేలు దెబ్బ
నువ్వూరు కోడా కన్నా
నీ తండ్రిని నేనున్నాను!
నా దగ్గర అన్యాయాస్త్రం వుంది!
వాడు పేదవాడు
మరీ బాధలో వున్నవాడు
అన్యాయం జరిగిందని
జరిపిన వాళ్ళకు విన్నవించు కొంటాడు
అందుకే మనకు చెప్పుకుంటాడు!
వాడు చెప్పింది మనం
బామ్మ దగ్గర బుడతడు
కాశీ మజిలీ కథ విన్నంత శ్రద్ధగా వినాలి!
ఎలపట కట్టాల్సిన ఎద్దును దాపట కట్టి
సేద్యం చేస్తూ పడే చికాకు
ముఖంలో కనబడ నివ్వకూడదు!
మెట్ట సాగులోనే ఎద్దు కాల్లో కర్రుదిగితే
మాగాణి సేద్యం గుర్తొచ్చి పడినంత బాధ పడాలి!
బావి పదడుగులు తవ్వితేనే జలపాతం లాంటి
జలం చూసి పడ్డంత ఆశ్చర్యమూ
ఎకరం నారును ఒక్కడే నాటగా
చూసినంత చిత్రమూ చూపాలి!
కుప్ప నూరుస్తు కురవబోయే వర్షాన్ని

తలుచుకొని చెందినంత ఆందోళనా చెందాలి!
మనం జోకొట్టాలి
వాడు జాన కావాలి!
నలుగురూ కలిసిన కూడలి
నాలుగు దార్లుగా చీల్చబడింది
ఏకాంతపు బాటసారికి
ఉన్న ఒక్క దారికీ చీకటి కప్పబడింది!
నువ్వెవ్వరు కోరా నా ముద్దుల కన్నా
నా దగ్గర అన్యాయాస్త్రం వుంది
అగుపడకుండా ప్రయోగిస్తాను
కనపడకుండా ఫలితం యిస్తుంది!

[1990లో మహాకవి శ్రీశ్రీ 7వ వర్ధంతి సంద
ర్భంగా జాతీయ స్థాయిలో ప్రథమ బహుమతి
పొందిన కవిత]

# ఉత్తర స్త్రీ గ్రహణం

అమ్మా నాన్ననూ సంబోధించాల్సిన ఉత్తరం
అమ్మకే పరిమితమైందని ఆశ్చర్య పడొద్దు!
తరతరాల స్త్రీ జాతిపై తరగని గౌరవమున్న నాన్నకు
ఈ ఉత్తరం గ్రహణం కావొద్దు!
ఇంతమంది అక్కయ్యలుండగా యింకెందుకు బెదురు
అని నాన్న ఇంటి ముఖం పట్టగా
అసలు కథ హాస్టల్లో అప్పుడే ప్రారంభమైంది!
రాయని కాగితం తెలుపని తెలుసేగాని
రాయక ముందే నలుపని తెలియదు!

విద్యాలయాల్లో
ర్యాగింగ్ నారుపోసి నీరు కట్టివుందని తెలుసేగాని
కుక్కమూతి పిందెలా
వికృతంగా వుందని తెలియదు!
దోగాడుతూ గదుల్ని వూడ్చడం
కాఫీతో ముఖాన్ని కడగడం
కరకాయ కాషాయాన్ని తాగడం
అభిమాన సినీనటుడ్ని పెళ్ళాడ్డం
శ్రీ శ్రీలా సిగరెట్టు తాగడం
ర్యాగింగ్‌లో నేడు పెన్సిలు గీసిన తేలిక గీతలు!
అలంకరించుకొన్న అతివలమధ్య
దేవాలయం మీాద బూతు బొమ్మనై
సిగ్గుతో కుమిలి కుమిలి కుచించుకపోయి

ఆవగింజ పరిమాణానికి నేను ఒదిగిపోగా
నా మర్మాంగంలో టెస్టుట్యూబు దూర్చి
మృగాలై మసలిన మగువల హేల
తల్లికి తప్ప నేనెలా తండ్రికి రాసుకోగలనమ్మా!
అమ్మా అని పిలవగానే
పంచప్రాణాలు పలుకులో కలుపుకొని
ఏమ్మా అని పలికే నిన్ను
ఆపత్సమయంలో నేనెన్నిసార్లు
అశక్తురాలినై తలచానో...
పిలిచానో...
విలపించానో...
అలాగని
అశక్తురాలినై అస్త్ర సన్యాసినికాక
విష సంస్కృతి కడుపున విప్లవిస్తాను!

# నువ్వు నీ సొంతం కాదు

నువ్వు నీ సొంతం కాదు
నువ్విక్కడే నిలబడి వుంటావు
ఎక్కడో ఒకడు నిన్ను వేలం వేస్తుంటాడు
ఎవడో ఒకడు కొంటూనే వుంటాడు!
ఎవరు తవ్వుకున్న గోతుల్లో వాళ్ళు పడక్కరలేదు
శ్రమ పడక్కరలేదు
ప్రతివాడికీ ప్రక్కవాడు తవ్విన గోతులున్నాయి!
ఏడ్పు తలరాతే అని నమ్మి ఏడ్చేవాళ్ళకు
ఏడ్పించే వాళ్ళు విధిరాతగాళ్ళు!
చేతులు కలపకనే
చప్పట్లు కొట్టగల సామర్థ్యం ముందు
చేతులు ముడిచి నిలిచిన అసమర్థత
చరిత్రంతా చోటు చేసుకొంది!
ధరించిన వ్యక్తిని బట్టి
పువ్వు పరిమళం మార్చుకోదు
హిమబిందువు
గరికకు జడలో పువ్వు!
ఒక కంట వత్తులు రాజుకుంటున్నా
ఒక కంట మబ్బులు కురుస్తూ
నిప్పును నిర్వీర్యం చేస్తున్నాయి
ఆకాశమంత ఎత్తు పెరగమంటూ
భూమి నిన్ను నిలుచో బెట్టింది!

నువ్వెలాగూ
సూర్యుడ్ని ముందేసుకొని పరుగెత్తలేకపోతున్నావు
కనీసం సూర్యుడి ముందైనా పరుగెత్తు
ముందు ముందు నీ తరం వెలుగులో పరుగెత్తుతుంది
సూర్యుడ్ని ముందేసుకొని ఉరుకెత్తుతుంది!
మోము ఎత్తి చూడు...
విసిరేసిన విత్తనం
తన్ను తాను విత్తుకొని
మొలకెత్తి
మోము ఎత్తుతూంది!

# మరణానికి మరో రంగు

యంత్రం పడమటి లోయల్లో పడిపోయిన సూర్యుడు
° పట్టుబట్టి శ్రమించి కొండల్ని జయించి
స్వ కనుమల్లో చేరి తొంగిచూస్తున్నాడు !
్క సంధించి వదిలిన తొలిబాణాలు
మెత్తగా తగిలి మరలుతున్నాయి
పనివారు రోడ్లకు తలదువ్వి జడలువేసే తీరును చూస్తూ
ాగిన ప్రపంచాన్ని మోసుకొని
ి జాగ్రత్తకు నా ప్రాణాన్ని అంకితంచేసి
ను !

ంగారాన్ని
రంగుతో ఓడించిన
ష్కారాలు కూడ నిండని ఓ భారతి

ఫ్రులోంచి
డ్డ బిడ్డ రూపుకు ప్రతీకై
మంటల్ని మోసుకొని
ాళికలా మంటలు నాలుకలు చాస్తుంటే

ంటూ
ాద పరుగెత్తి పడిపోగా
లుకలు ఆమెను కబళించేశాయి !

కౌరవ పాండవులు చుట్టూ చేరగా
కురు వృద్ధులు గురు వృద్ధులు చూస్తుండగా
ఏ ఒక్క వృకోదరుడూ ఒక్క ప్రతిన పలక లేదు
ఏ ఒక్క ఫల్గుణుడూ గాండీవం వైపు తనచూపును మళ్ళించ లేదు!
యథావిధిగా నేను సూర్యుడితో పాటు సాయంత్రం చనిపోయి
మర్నాడు ఉదయం పుట్టి
పేపరు మోసుకొచ్చిన ప్రపంచంలో
మానసిక వ్యాధిగ్రస్తురాలై ఆత్మాహుతి చేసుకొన్న
అబల భారతి వార్త చదివి అవాక్కయ్యాను!
పేదతనం ముంగిట పలుకుబడి
ఎంత అందంగా ఇంద్రధనుస్సు వేసింది...!
రోజూ నేను పుడుతూనే వున్నాను
సంవత్సరానికి మున్నూట అరవై ఐదుసార్లు పుడుతూ నేవున్నాను
అనుమానాస్పదంగా అశువులుబాసిన అబలల బ్రతుకుల మీద
మానసిక వ్యాధి పీడిత బోర్డులు
వేలాడదీయడం చూస్తూనే వున్నాను!

# నేటి బాటలో రేపటి తండ్రి

అతి జరూరుగా డబ్బు పంపమన్న నీకార్డుముక్క కబురు
గట్టు తెగిన నీరు
మొలకెత్తే మడిని ముంచిన వార్తలా నన్ను చేరగా
దున్నుతున్న అరక దుక్కి దగ్గరే ఆపి
ఊరుగాని ఊరిలో త్రిశంకుడై తావని
ఊళ్ళో అడగకూడని వాళ్ళను అడిగి అప్పుచేసి
అపరాత్రి వేళ ఆఖరి బస్సును పట్టుకొని నిన్ను చేరి
చదవడమో నిద్రించడమో విద్యార్థి చెయ్యాల్సిన
వేళగాని ఆవేళలో నువ్వాడే క్రీడను చూడగా
ఎవరని నన్ను గురించి నిన్ను ప్రశ్నించిన
నీ విలువైన మిత్రుల ముందు
నన్ను విలువగట్టి మా "పాలేరు" అన్న
నీ రాజఠీవిని చూశాను!
తల్లిని నరికిన చరిత్ర పరశురాముడిది
తండ్రిని పాలేరన్న ఖ్యాతి నా తనయుడిది...
బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధకం
ఋతువులై మనిషితో ప్రతిఫలింపగా
వార్ధకపు పంట
నా ఎండిన దవడలు, పండిన తల
రంగు మారిన శరీరం, ముడతల ముఖం
నెరసిన గడ్డం, తరిగిన చూపు
అదనంగా ఆర్థిక బాధలు

నా కండల్ని ఆకలికి వాడుకొని
పన ఎత్తిన పొలం నూపు నాకు ప్రసాదించాయి!
భీమయ్య బలంలో భీముడే కాదు
అందంలో నన్ను చంద్రుడన్న ఆనాటి ఊరిమాటలూ
పదిమంది తల వెంట్రుకలు మీ కొక్కరికే పుట్టాయి
ఎన్ని కుంకుళ్లు వాడినా
తల విడవకుండా వుందన్న మీ అమ్మ మాటలూ
సత్యహరిశ్చంద్రలో కాటి కాపరినై
ప్రేక్షకుల కంట కార్పించిన కన్నీరు పారి
నా పాదాలే తడిసిన సన్నివేశమూ
అంత్యక్రియల సందర్భంగా ఆద్యంతం గుర్తు చెయ్యకపోతే
ఈ అంతిమ ఉత్తరం అసంపూర్ణమౌతుంది!
నేను కూలి చేసి నా కడుపు ఎండగట్టక పోతే
నీ కడుపు నిండని చరిత్ర నాది
కాకికి బిచ్చమేస్తే కాస్త కృతజ్ఞత చూపేది అనుకొంటూ
చనిపోయిన నా కొడుకుని సమాధి చేసుకుంటున్నాను!

# దిక్కులే ఎక్కిపెట్టిన బాణాలు

చూపున విషాదం
నడకన దైన్యం
నిత్య శవవాహకులైన వారి
నడకను ప్రశ్నిస్తే
ఉత్తర దిక్కును వేలెత్తి చూపి
దించిన తల ఎత్తకుండా నడుస్తున్న దీనస్థితి!
గతమెంతో ఘన కీర్తికల
నీ దేశం ఉన్నతమైంది
విప్లవాల మయమైన నీ దేశాన
వీరుల త్యాగం వెదజల్లి వుంది
భిన్నత్వంలో ఏకత్వం
పీటముడి వేసికొంది!

పక్కవాడు
పరాయి పాలకుడు
నీ అశక్తిని తూచినవాడు
నిరాసక్తిని కొలిచినవాడు
అనైక్యతను చూసినవాడు
తన దేశ సరిహద్దుల్ని చెరిపి
నీ దేశ సరిహద్దుల్లోకి జరిపి
కలపగా...

పవిత్రమైన నీ జాతీయగీతం
అవమానానికి గురై ఆత్మాహుతికి పాల్పడుతుంది

దేశాన్ని మూపుపై మోస్తున్న జాతీయ కేతనం
చిత్రహింసకు గురై హత్యచేయబడుతుంది
నీ సంస్కృతి విదేశీ ప్రదర్శనశాలల్లో
అద్దాల షోకేసుల్లో భద్రపరచబడుతుంది
నదీ జలాలు నిన్నూ నీ మట్టినీ మరిచి
నూతన సరిహద్దుల్ని ముద్దాడుతాయి
భూమి ప్రసవించిన భూగర్భ సంపద
పరాయి వాడింట పురుడు పోసుకొంటుంది
నాగలి నిరుద్యోగై
ఉద్యోగం కోసం ఎదురు చూస్తుంది
నీ దేశంలోనే నువ్వు పరుడి చేత
పరాయి వాడిగా పాలించబడి
నీ స్వేచ్ఛ కొనబడి నీకే అమ్మబడుతుంది
కొనుక్కొన్న స్వేచ్ఛలో వూపిరి సలపక వులిక్కిపడి లేచి
నువ్వెక్కడున్నావో నిన్ను నువ్వు వెతుక్కొని
కప్పుకొన్న నిర్బంధాన్ని విప్పుకోను యత్నిస్తే
దిక్కులు నీ చుట్టూ ఎక్కుపెట్టిన బాణాలై నిలుస్తాయి.

# తరతరాల పల్లకి

ఆదిమయుగం
మధ్యయుగం 
ఆధునిక యుగంలోనూ
మాతృక అదే అయినా
మార్పు చెందిన రూపాలతో
నేను ఇప్పటికీ మోస్తున్నది పల్లకీనే!
రాజు 
భూస్వామి 
నాయకుడు 
కాలానుగుణ్యంగా వూరేగుతూనే వున్నారు
దిగాల్సినచోట దిగుతూనే వున్నారు
ప్రజల భుజాలపై పల్లకి పయనిస్తూనే వుంది!
దమ్మిడీ ఖర్చు లేకుండా
యుద్ధాలు సాగిన రోజుల్నుండి
మిలియన్ కోట్ల డాలర్ల ఖర్చుకు చేరుకొన్న
ఈ పెరుగుదల ఎదుగుదలే!
పరిచిత గాయాల్ని ఎదుర్కొని దాటి
అపరిచిత గాయాల్లో
ఓడిపోవడం కూడా మకుటమే!
ఒక్కొక్క గాయం
ఒక్కొక్క శతాబ్దానికి
సరిపడే వుండు ఐనప్పుడు

మోయ్పించే భారం భుజాన వేసుకొన్న
వైద్యుల్ని మనమెంత మందిని
మొయ్యలేదూ?
గడియారం తిరుగుతున్నదే గాని
అనుక్రమణిక మార్గంలో
లేదని మనం అనుకొన్నామా ?
పంజరం బంగారమైతే
పక్షి వునికి ప్రమాదం
దిగుమతి అయ్యే సంగతి
పక్షికి ఎలా తెలుస్తుంది?
ప్రశ్నలూ జవాబులూ
రెండూ మౌనంలో పొసగినప్పుడు
పల్లకీ భుజాలపై ప్రయాణించక తప్పదు !

# రంపలు వారుస్తున్న చీకటి

రెండు వర్గాలు జీర్ణించుకొన్న
అవును
కాదు
ముక్తకాల్లో...
బ్రతుకు చట్రం బిగిసిపుంది!
"అవును" చెప్పేది విన్నపం
"కాదు" ఇచ్చేది శాసనం!
ప్రాణవాయువు ఒకడి భిక్ష ఐనప్పుడు
ప్రాణి బ్రతుకు పరాధీనమే!
ఇసుక పొరల అడుగున
మాటు వేసిన నల్లరేగడి చాటున
వడకట్ట బడిన స్వేదం
కూడబెట్ట బడుతూంది!
స్వేద తర్పణుడు
శ్రమైక జీవుడు
తప్త హృదయుడు
నల్లరేగడి నేలలో
చీకటి బజారు చిరునామాలముందు
క్షుధతో...
వ్యధతో...
నలుపు పూసుకొన్న
తెలుపు ఎనామిల్ రంగుమాసి

స్వచ్ఛతకై సమరానికి సిద్ధమైతే...
శిలువను శిరస్సుపై మొయ్యాల్సి వస్తుంది
కాలాన్ని నడపడం చైతన్యం
కాలం గడపడం బలహీనత!
అవినీతికేం సమృద్ధిగా వుంది
అందుకు అనుబంధంగా
బంధుప్రీతి
ఆశ్రిత పక్షపాత నిల్వలు ప్రోత్సాహకరంగా వున్నాయి
ప్రజల ఆకల్ని పెంచడానికి
పంచడానికీ!

# మమతల బంధం

సముద్రంలో సంగమించిన నది
మళ్ళీ తన ఉనికి కోసం
బిందువుగా భూమ్మీద రాలుతుంది
శేష జీవితం నిశ్శేష సమయంలో
పదవీ విరమణ చేసిన మనిషి
పసిబిడ్డ చేష్టల్లోకి జారుతాడు
రిటైరైన నన్నూ నువ్వూ
అమ్మను అన్నయ్యా
పంచుకొంటామంటూ
నువ్వు రాసిన ఉత్తరం నేడు చేరింది!
అద్దాలు మాకు ప్రసాదిస్తున్న అర్థ చూపుల్ని
ఇద్దరం కలిపి పూర్ణదృష్టి చేసుకొని
బ్రతుకు నాటకం చివరి అంకాన్ని ఈదుతూ
జీవన పోరాటంలో ఒకరికొకరం
మూడోకాళ్ళై నడకలు సాగిస్తున్నాం!
సాధించింది అపజయమై చేతికి దొరికిందని
ఆ వేదనతో ఆహూతవుతూంటే
తోడు నిలిచిన వారి పూరడింపే స్వర్గం
చేతిలో ముద్ద నోటికి అందక
శక్తి హీనమైనప్పుడు
బంధం యిచ్చిన చేయూతే భాగ్యం
అవసాన దశలో ప్రాణం

ఒక ప్రాణి చేయి ఆసరా కోరుతుంది!
ఆస్తి అయితే అడ్డుగోడ కట్టి భాగించుకోవచ్చు
ఇన్నేళ్ళ వైవాహిక జీవితంలో
మా బంధం
విశాల సముద్రమై విస్తరించి
గాలై వ్యాప్తి చెంది వున్నప్పుడు
మమ్మల్నెలా విభజించుకొంటారు
పంచుకోవడం మానుకొని
పెంచుకోండి!

# స్వైర విహారం

చలికి సూర్యుడికి కప్పిన ఎర్రశాలువా
తూర్పు సంధ్య తొలగించి మేల్కొల్పింది
తను లేవక ముందే నిద్రలేచి నడుస్తున్న
లోకాన్ని చూసి
జాలిపడ్డ సూర్యుడు
విద్యుక్త కార్యానికి ఉద్యుక్తుడయ్యాడు
దేశ సంపద అరవై కుటుంబాలకే హస్తగతమైనట్లు
నగర వాసుల ప్రాణాలు
సిటీ బస్సుల చక్రగతమై పరిభ్రమిస్తున్నాయి!
చక్రాలేగాని బ్రేకుల్లేని బస్సుల మధ్య
ప్రాణాలు ఇనప్పెట్టెల్లో దాచుకున్నా
ఫలితం దక్కకుండా వుంది
భవిష్యత్తును బ్యాగులో దాచి
మరణ మృదంగాల మధ్య
అక్షరాభ్యాసం కోసం జనారణ్యంలో
అడుగులు వేస్తున్న బాలుని బ్రతుకు
అదుపు తప్పిన బండి కింద
అర్థాంతరంగా ముగిసి
నల్లని రోడ్డు మందారంలా మారింది!
జన నియంత్రణే లక్ష్యమై రవాణాధికార్లు
నగరాన్ని నేరస్తులకు అంకితం చేసిన పోలీసు యంత్రాంగం
తప్పొప్పుల పట్టికలో

ఒప్పుల కిరీటం తప్పులకు కట్టబెట్టి జారుకుంది!
మనఃక్లేశాన మరణించిన సూర్యుడిపై నల్లశాలువా కప్పి
పడమటి సంధ్య రోదిస్తూ వుంది
చనిపోయిన బాలుని శవం
అంతిమయాత్రకు బయలుదేరగా
చంపిన బస్సు
స్వైర విహారానికి కదిలి ఎదురైంది!

# వెన్నెల కురిసిన ఆమ్లవర్షం

ఆకుల చివర్లనుండి నీటి బిందువుల
ఆత్మహత్యలు
పండి ఎండిన ఆకుల
నిండు మరణాలు
కురిసి వెలిసిన చినుకుల మధ్య
మలి సంధ్య మృత్యువు నీడలో నిల్చి
నా కళ్ళకు కట్టిన సత్యాలు!
పరాభవంతో నిలబడినందుకు
నరాల్లో పారే రక్తం నాటిన బాధ...
ఎగిరే గాలి పటం తెగినప్పుడు
నిరాశగా నిల్చిన పసివాడి కాళ్ళలో
వేల పర్వతాలు కరడు గట్టిన బరువులు...
అప్పుడు నాకు సంక్రమించిన ఆస్తులు!
పగటి ద్వేషాల పరిసమాప్తికై
రాత్రి నడుం కట్టగా
వెండి వెన్నెలే ఆమ్ల వర్షాన్ని కురిపించింది
పావురమే పులై గాండ్రించింది
నలుదిక్కుల నుండి నడిచి వచ్చిన
ప్రశ్నార్థకాలకు
నేను జవాబుదారై నిలిచాను!
బ్రతుకు ప్రహేళికల్ని
పూరించలేని బాధలు

మాటల్లో చెప్పలేని గాథలై
కళ్ళను వెతుక్కుంటున్నాయి!
గోడ ఎప్పుడూ ఒంటరిది కాదు
దానికి భూమి తోడు వుంటుంది
నిజం ఇసుకలో జారిన నీరైనప్పుడు
కన్నీరు కార్చక
అభినవ భగీరథుడనై ప్రజ్వరిల్లడమే
నాకు పరిష్కారమార్గం!

# హంతకాక్షరాలు

అక్షరాలు మనిషిని హత్యచేసే సాధనాలు
అస్తవ్యస్తంగా పరుగిడే మేఘాలు
ఆందోళనకు గురిచేసి
ఋతువుల్ని మరిపిస్తాయి
దారితప్పి తిరుగాడే అక్షరాలు
దారి కాచిన గూండాలు
మరణాల ప్రస్థానంలో
పోస్టు మార్టం
మారణాయుధాల్ని వెలికి తీయిస్తుంది
అక్షరాలు చేసే హత్యలు
ఏ ఆధునిక శాస్త్ర పరీక్షలో నెగ్గవు!
సచ్చరిత్రుడు
బోధివృక్షమై నీడ పరిస్తే
పాడలాంటి నీడ పరిగణనకు రాదు
కొనుగోళ్ళ ముడుపులు
పరస్త్రీ ప్రణయం
భూ ఆక్రమణ
మనిషి హత్యకై
అక్షరాలు ఎన్నుకొనే సరైన కల్పితాలు
శాస్త్రీయ నిరూపణకు ఆవశ్యం
సాక్ష్యం—
డాక్యుమెంట్లు—

డాక్యుమెంట్ల తయారీ కుటీర పరిశ్రమ
అది శ్రమ రహిత కార్యం
సాక్ష్యం సంతలోని వస్తువు
అది గూటిలోని రామ చిలక !
చెక్కిళ్ళపై కట్టిన చారలు
దుఃఖాశ్రువులో
ఆనందాశ్రువులో సాక్ష్యం చెప్పేది కళ్ళే
అది
వినకపోతే అన్నీ కట్టుకథలే !
అక్షరాలు మనిషిని హత్యచెయ్యడమే కాదు
అప్పుడప్పుడూ ఆత్మహత్యనూ బహూకరిస్తాయి !

# బాల్య బ్రతుకులు

ఉదయానికి అమ్మబడిన బాల్యం
కిరణం కొరడా దెబ్బకు ఉలిక్కిపడి లేస్తుంది
పూర్వార్థంలో
పట్టె మంచాలపై పొర్లాడి
ర్యాకుల్లో
ఇనుప పెట్టెల్లో దొర్లాడి
ఏసి రూముల్లో నిద్రించిన
కాగితాలు
ఉత్తరార్థంలో బంగారు బాటల
బతుకు చెడి
రోడ్ల పాలయ్యాక
చిగురించని
బాలల చేతులు ఏరి
చినుగుల బస్తా సామ్రాజ్యం చేర్చుతాయి!
తమను ఆరో ప్రాణంగా కళ్ళకద్దుకొన్న
చిత్తు కాగితాల సేకరణా కుచేలుడిని
"లాంగ్ లివ్" నినాదంతో దీవించుతాయి!
కాగితాల కొనుగోలు కుబేరుడి
ఆజ్ఞను శిరసావహించిన
తూకపు రాళ్ళ పళ్ళెం
భూమ్యాకర్షణకు లోనౌతుంది
బాల్యాన్ని త్రాసులో ఉంచి

తదేక దృష్టితో చూసే కుచేలుడిని
బరువుండీ బలహీనమైన
చెత్త కాగితాల చింపిరి బస్తా
కన్నీటితో అభిషేకిస్తుంది
రోజువారీ బాల్యాన్ని
కడుపు నింపని వెలకు అమ్ముకొన్న బాలుడు
రేపటి కిరణం కొరడా దెబ్బకు
ఎదురు చూస్తూ నిద్రిస్తాడు!

# నేరానికి శిక్ష లేదు

నువ్వు వేసిన బాంబుతో
చనిపోయేది నీ అనుచరులు కాదు
నువ్వు పన్నిన రాజకీయ చదరంగంలో
నష్టపోయేది నీ సంతతి కాదు
నువ్వు చేసిన కల్తీ సరుకుతో
మోసపోయేది నీ ఆప్తులు కాదు !
ప్రజాస్వామ్య పంథాన పయనిస్తూ
సమతావాద శంఖాన్ని పూరిస్తున్నవాడు
ఏ విద్రోహకుడో విసిరిన రాయికి పడిపోతాడు
ఏ హంతకుడో విసిరిన బరిసెకు బలైపోతాడు
ఏ దుండగుడో కాల్చిన కాల్పులకు గురౌతాడు
అందుకు కారణాలు కోకొల్లలు
ఒకరోజు భాషా ఉద్యమం
ఒకరోజు కుల మతాల ఉద్యమం
ఒకరోజు ముఠా బలాల ఉద్యమం
రాక్షస ప్రవృత్తిలో రక్తపాత ఉద్యమాలు !
ఉద్యమ విజయాలు విగత జీవులపై
ఆధారపడి వుంటాయి
విగత జీవుల సంఖ్యను బట్టి
ఉద్యమకారులు ఉద్భవించి
గాంధీని గుర్తు చేస్తూ
అహింసను బోధిస్తూ

మార్టిన్ లూథర్ కింగ్
నెల్సన్ మండేలాలను
ఉదహరిస్తూ పుక్కిలిస్తారు!
మఖలో పుట్టిన ఉద్యమాలు మఖలోనే గిట్టి
సముద్రాల్లోకి
శ్మశానాల్లోకి
ఎడారుల్లోకి కొట్టుకు పోతుంటాయి!
చీకట్లో జరిగిన మతలబులు
వెలుగున విచారణ కొస్తాయి
వెలుగు చూసిన విచారణ ఫలితాలు
చీకటి పాలవడం షరా మామూలే!
నేరానికి శిక్ష లేనప్పుడు
బ్రతుక్కి గ్యారంటీ లేదు!

# పిడిలేచే కెరటం

ఎదురు చూపులోని బ్రతుకెంత
వేదనా పూరితమో
పార్కులోని బల్లలన్నీ సమావేశమై
ఏకగ్రీవంగా తీర్మానం చేసి
కరపత్రాలు పంచినప్పుడు...
గొంతు ఎండిన
గుండె చేతులు
దాహంతో దోసిలి పట్టగా
ఎండిన కొళాయి
వేడి నిశ్వాసలు
అరచేతులపై
యాసిడు బొబ్బలై తేలినప్పుడు...
కలం, దువ్వెన, కళ్ళజోళ్ళల్లా
భార్య భర్తకు
నిర్జీవ వస్తువై
అవసరం తీర్చి
త్యజించబడి ఎదురైనప్పుడు...
పద్మాసనం క్రింద గరిక
గుండెల్ని పచ్చడి చేసుకొని
ప్రాణం కోసం పెనుగులాడుతున్నా
కదలని ప్రాణిని కలసినప్పుడు...
నేను

ఎదురుగా కడలి ఒడ్డున
పడిపోయిన కెరటం వెంట
పడిలేచే కెరటాన్ని చూపుతాను
అప్పుడూ అర్థం కాక
తల పంకించితే
తుపాను తాకిడికి పడ్డ వృక్షం
నేలను ఆశ్రయించి
మళ్ళీ మొలకెత్తి మొక్కయి పెరిగి
మానుగా మారిన చిత్రం చూపుతాను!

# నైఋతి

అది
రంగు రుచి వాసన లేనిది
విశ్రాంతి బడలిక విడిది లేనిది
నిరంతర సంచారి
నిత్యశ్రమైక జీవి!
కీచకుల చేతుల్లో
అబలల —
దుండగుల చేతుల్లో
అశక్తుల —
ఆర్తనాదాల్ని మోస్తుంది!
శీతల గదుల్లో పుట్టిన
జనవంచిత పథకాలు
జనహత్యా ప్రయత్నాలు
ప్రజల ముంగిట పరుస్తుంది!
పీలిక మబ్బుల్ని ఏరి
పందిళ్ళు వేసి
కదలని మేఘాల్ని
పాలెగాడై కదిలించి
శిఖరాల్ని ముద్దాడించి
ధరిత్రిపై క్షీరాన్ని పారిస్తుంది!
అలసత్వమో
అకృత్యమో

గురివింద పరిమాణ
గుడిసె దహనం
లంకా దహనంచేసి
సముద్రంతో ఫ్రంటుకట్టి
హరిత క్షేత్రాల్ని
మానవ వాడల్ని
మరుభూమిగా మార్చి
ఘోరకలి జరుపుతుంది!
అది గాలి
అది నిరాకారం
ఊపిర్ని పంచుతూ
ఊపిర్ని తెంచుతూ
రూపాలను పాలిస్తుంది!

# నిశ్శబ్దం నినాదమై

చూపుకు రెప్పలు
ఒకోసారి కారు మబ్బులు
నీ చూపు నిర్విరామంగా ప్రసరిస్తూనే వున్నా
లాలిత్యాన్ని
పంచాల్సిన గూటికి
కాఠిన్యాన్ని
ప్రదర్శించాల్సిన చోటికి చేరదు!
అది నీ క్షోభిత
వ్యధిత హృదయం మళ్ళించి
వర్గప్రేమతో
జీవితకాలం కారు మబ్బులు
పెనులబ్ధిపొందే ప్రయత్నం!
ప్రాణికి ప్రాణికి మధ్యనున్న
ఎడాన్ని
నిశ్శబ్దాన్ని ఆక్రమించి
ప్రాణి ప్రాణి ఏకంకాకుండా
నిశ్శబ్దం శబ్దంగా మారకుండా
వేళ్ళూని శాఖోపశాఖలై నిలుస్తాయి!
నీ లాలిత్యాన్ని పంచుకొనే గూళ్ళు
నీ చూపుల గ్రహణం చూసి
నీ దరికి కదిల్తే
ప్రాణి ప్రాణి సమన్వయమై

అన్ని బిందువుల కలయికతో
అంబుధి చేరి
నిశ్శబ్దం నినాదం చేసి
విశ్వరూపం ధరించి
సమరానికి సమాయత్తమౌతాయి !

# నీడలో నీడలు

ఇది గుండె నిలువు కోతభాగం
జాలి, త్యాగం, ప్రేమ, కరుణ
స్పందన, చైతన్య భాగాలు
వరదై ఉప్పొంగే ప్రయత్నాన్ని
రెండు అదృశ్య హస్తాలు
యమ పాశాలై
ఉరితీస్తున్నాయి!
మెదడులో దాగిన
సెరిబ్రం సెరిబెల్లం
మెడుల్లా ఆబ్లాంగేటాదులు
శక్తితో
యుక్తితో
అధిక దిగుబడి మేధా సంపత్తికై పడే
అహర్నిశ శ్రమను
అదృశ్య హస్తద్వయం
దృశ్యమై అడ్డుతున్నాయి!
సరికొత్త గమనానికి
చూపుకు మంగళం పలికించి
నీడలో నీడలైన
రెండు చేతులు
రెటీనాను పిండి
కనుభూముల్లో

జలాశయాలు నిర్మిస్తున్నాయి
కన్నీటికి కళ్ళు లోకువయ్యాయి !
అదృశ్య హస్తాల
విజయ విహార ఛేదన
మానవ కళ్యాణానికి
మహోన్నత సాధన !
సూదికి దారం ఎక్కించాల్సిన
సమయం దాటిపోతూ వుంది
సూర్యుడు కొండలోకి జారుతున్నాడు
యుద్ధ సన్నద్ధానికి ముందు
చినుగుకి వెయ్యాల్సిన మాసిక
నశేషమౌతుంది
లే ! లే !

# ఆధునిక చరిత్ర

ఇక్కడ హైబ్రీడ్ వాగ్దానాల చెట్లు మొలిచి
క్షణంలో
పూలు ఫలాలు అందిస్తాయి
ఇక్కడ హైబ్రీడ్ పునాదుల మేడలు లేచి
ఆకాశ హర్మ్యాలై నింగిని చుంబిస్తాయి
ఇక్కడ హైబ్రీడ్ విలువల మానవత్వం పెరిగి
మహోన్నత శిఖరాల్ని తలదన్నుతుంది!
పరుగులో దాగిన అప్రమత్తత
పొరుగు వాడి పతనం కోసం
నడకలో నేర్చిన నైపుణ్యం
తిమిరాన వెలుగు తరమడం కోసం
మాటలో నేర్చిన మెలకువలు
మనసున ములుకులు నాటడం కోసం
ఆత్మల కర్మాగారంలో ఉత్పత్తి
ప్రాణాంతక విష ఔషధాలు
హృదయాంతరాళంలో కట్టిన గృహం
సోదర సంహారానికి నిర్మించిన లక్కయిల్లు
సహపంక్తి భోజన ప్రక్రియ
సామూహిక హత్యాక్రీడ
నునుమొగ్గల్లో
పరపరాగ
స్వపరాగ సంపర్కమంటూ

కల్పిత కథా సంగమం
ఆత్మద్రోహ సంకల్పం!
పొత్తిళ్ళలో పాప ఆత్మహత్యా ప్రయత్నం
గాఢ నిద్రాలోలుడి ఆత్మాహుతి యత్నం
అందుకు సాక్షిగా
అధికార ధృవీకరణ పత్రం
పాఠకుడికి
ఆధునిక చరిత్రచూపే సత్యం!

# సముద్రుడి సందేశం

ఓడిపోయి
పరాభవం పాలయ్యాక
వెంటాడే అవహేళన
నన్ను సముద్రం చెంతకు చేరుస్తుంది!
వెనుదిరిగిన అలను చూసి
నేను వెనుదిరిగితే
వెన్వెంటనే లేచిన అల
నన్ను పలకరించి
పరామర్శిస్తుంది!
పడిపోయిన
తరంగాన్ని చూసి
పడిపోవడం ఓడిపోవడం కాదని
పైకి లేచిన తరంగం నేర్పినవిద్య
అధ్యయనం చేసి
పరుగులు తీసే
నా కాళ్ళను చూసిన ఇసుక
నా పరుగును
నడకగా మార్చి
నాకు హితబోధ చేస్తుంది!
గెలుపుకు పరుగు ఆరోగ్రప్రాణమైనా
పరుగు ఆలోచనకు ఒక్కోసారి
ప్రతిబంధకమౌతుంది

అప్పుడు
నడక శూన్యంలో క్రాంతి దర్శనంచేసి
గోరంత దీపం వెలిగిస్తుంది
అప్పుడు
నేను మహారణ్యమౌతాను
ఆకాశం కమ్ముతాను
ధరిత్రి నిండుతాను !

# చేజారిన బాల్యం

కలిమి తెచ్చిన వాడి క్రౌర్యం కళ్ళ ముందు
లేమి యిచ్చిన నా చెమ్మ కమ్మిన చూపులు
బాల్యంలో బానిసత్వాన్ని
వారసత్వంగా సంక్రమించుకొన్నాయి!
ఈగలు ముసిరిన చోటు
బెల్లమని భ్రమించే బాల్యం
కుళ్ళిన మాంసం ముక్కని వూహించదు!
గడియారం ముళ్ళు తిరుగుతుంటే
కాలెండరు కాగితాలు మారుతుంటే
కోడి కూత మొదలు కనువాల్చేదాకా
బానిసత్వం యిచ్చిన భారాన్ని
భుజాన మోసుకొని
కాలంతో పాటు కాళ్ళు యీడ్వటం నాకు తెలుసు!
బండలు మొయ్యడమే బ్రతుకని
బాల్యంలో అదొక భాగమని
బాల్యం మంచు గడ్డలా కరుగుతుంటే
అల్లీ బిల్లీ ఆడిస్తూ
తప్పటడుగుల్ని వీక్షిస్తూ
తల్లినై పరులింట కాపలా కాసానుగాని
ఎన్నడూ నా తల్లి ముందు పసిపాపను కాలేదు!
సూర్యుడున్నా వెలుగులేక
బాటలున్నా దారిలేక

బాల్యాన్ని కరిగించగా వచ్చిన బ్రతుకు తెరువు
వృద్ధాప్యం నా తల్లికిచ్చిన
దీర్ఘవ్యాధిని జయించి
లేవనియ్యని మంచాన్ని ఓడించింది!
నన్ను కౌగిలించుకొన్న నా తల్లి
"తల్లీ" అన్నప్పుడు
నా తల్లికి
నేను తల్లినై
మాతృత్వాన్ని పంచిపెట్టి
బాల్యాన్ని
బాల్యంలో జారవిడుచుకొన్నా!
బాల్యాన్ని వరించిన
బానిసత్వ కాలంలో
బాల్యం కోసం
వెతకడం మానుకొన్నా!

# నేలకు దిగని సూర్యుడు

నా కళ్ళు నాకు శత్రువులుగా తయారయ్యాయి
గుండెల్లో దాగిన సముద్రాల్ని
బొట్లు బొట్లుగా బాధలు వడకట్టగా
క్రమం తప్పక కళ్ళు నీళ్ళోడుతుంటాయి !
పుట్టిన కన్నీటి బొట్లు
నేలమీద చిట్లి
ఆత్మహత్యకుగురై
ఆర్తనాదం చెయ్యగా
కలత చెందిన రక్తసంబంధం
ముసురుకి ముసిరిన పుసుళ్ళులా
వ్యక్తావ్యక్త వేదనతో నా ఆవేదనను ప్రశ్నించగా
ఆడదానికి ఆరుబయట
ఆదమరచి నిద్రించే హక్కు లేదని
అది భంగపరిస్తే
మానభంగం చేసే హక్కు మగాడికి వుందని
అభివృద్ధి చెందిన విశిష్ట నాగరికతలో
భార్య శీలాన్ని అమ్మి
భర్త బ్రతకడం తప్పు కాదని
నా మనస్సు చుట్టూ అలికిన పంకిలం
కుడుములు యిస్తేనే పండగని భ్రమించే
నా పసిబిడ్డల పాలమీగడ మెదడుపై ఎలా చల్లను ?
అందుకే

మీ కళ్ళు వర్ష ఋతువులు కాకుండా వుంచడానికి
నా కళ్ళు శరదృతువులు అయ్యాయని చెప్తాను!
అప్పుడు
మహాసాధ్వి జిజియాబాయి
వీరనారి రుద్రమదేవి
మగువ మాంచాల
మా ఇంట కొలువు చేస్తారు!
వీరధీరుడు బాలచంద్రుడు
విప్లవవీరుడు భగత్ సింగూ
అమరత్వంలోంచి మా ముంగిట జీవత్వంపొంది
ఎత్తిన చేయి విజయం సాధించేంతవరకు
దించవద్దంటారు!
నడినెత్తికి వచ్చిన సూర్యుడు ఎప్పుడూ
నేలకు దిగడంటారు!

# పడగనీడలో

భూగోళంలో సగభాగం స్త్రీలదే
ఐనా...
స్త్రీలు నిర్భయంగా
అడుగెయ్యలేని గందరగోళమిది!
పొట్ట నింపుకోను గడపదాటుతున్నావు
కొంగుమాటున కత్తిదాచుకోవమ్మా!
వికృత ఆలోచనాలోచనంలో
ఆకలి కొత్తది
చట్టం వలయంలో
శిక్ష సరికొత్తది
సాక్ష్యం పరిధిలో ఎన్నిసార్లు లెక్కించినా
చేతి వేళ్ళ సంఖ్య తేలదుగాక తేలదు!
అప్పుడు...
మానభంగం పదానికి
మరో విశ్లేషణ చేర్చి
చేయి వేళ్ళ రహితమని
తీర్పు చెప్పబడుతుంది!
తీర్పుకోసం
నిరీక్షణే నీకు బ్రతుకైతే
నిర్జీవం బ్రతుకు గెలుపు
మేలు కోసం
వేడుకోలే నీకు ధ్యేయమైతే

బుద్బుదం బ్రతుకు పంట
చూపు ఆగినా మానని నడకకూ
నాలుక తెగినా ఆగని పాటకూ
ప్రజలే పల్లవి పాడుతారు!
కాటు వేయడానికి స్వేచ్ఛ వున్నప్పుడు
కత్తి ఝుళిపించడానికీ హక్కు వుంది
పొట్ట నింపుకోను గడపదాటుతున్నావు
కొంగుమాటున కత్తిదాచుకోవమ్మా!

# నేను నడుస్తుంటాను

భూమిని భుజాలపై మోస్తూ
పుడమితల్లి ఋణం తీర్చుకొంటుంటాను
మోసేవాడు కొడుకే కదా
అలసట తీర్చుకోమని తల్లి ఏనాడూ అనదు!
గ్రీష్మంలో ద్రవీభవించి
శీతలంలో ఘనీభవించే
కోసిన గుండెల మధ్యన
నేను నడుస్తుంటాను!
పాతేసిన ఆశలు పాదాలకు తగిలి
విలపిస్తాయి
మాసిన స్మృతులు ఎదురై
మరకలు చూపుతాయి
పల్లె పట్నానికి ఉగ్గుపాలు పొయ్యడం
తాగిన రొమ్మును
తనయుడు గుద్దడం
నిరక్షరాస్యుడు
అక్షరాస్యుడి ముందు
సంస్కార పాఠాలు చదవడం మధ్యన
నేను నడుస్తుంటాను!
వసంతాన్ని పంచుకోవడంలో
రాతి నేలకూ నల్లరేగడికీ పోటీ
ఫలితాలు యివ్వడంలో మాత్రం పోటీలేదు

ఊరిని కానే కుక్కకు ఒక్కరూ
నాలుగు మెతుకులు వెయ్యడంలేదు
మరి దాని విశ్వాసం దేనికో ?
కిటికీ రెప్పల్ని విప్పేసరికి...
గుమ్మం రెప్పల్లో ఒకడు కాపలా
కనుగుడ్డు తిప్పి చూసినా నిఘా శంకిస్తుంది
దారిద్ర్యం సముద్రమయ్యాక
నడవడానికి దారెక్కడిది ?
అయినా నేను నడుస్తుంటాను !
ఎప్పుడూ నన్ను వెన్నాడేవి
ప్రభుత్వ పన్నుల నీడలు
కేంద్ర రాష్ట్ర రాజకీయ క్రీడలు
నన్ను సమాధి చేసి
నా వారసత్వాన్ని వెంబడిస్తాయి
అయినా నేను నడుస్తూనే వుంటాను !

# ఇంకాని ఇక్వైసాగదు

అపురూపాన్ని చూసి ఆదమరచిన
ఆహ్లాద సమయాన
అంతానికి ఎక్కుపెట్టడం
యుక్తి ఐనప్పుడు
పసిపాపంటే భయం
పావురమంటే భయం
అరవిరిసిన పూవంటే భయం !
వెలుగు, వెన్నెల, గాలి, నీరు
అటువైపు నిషేధమై
ఒక్కడ్ని ఆవిష్కరించడానికై
వేలమందిని హతంచేసే
అధునాతన క్రీడకు
సై అంటూ చేతులెత్తిన వారి
చంకల్లో మరతుపాకులు శ్వాసిస్తున్నాయి !
ఇంటింటి కన్నీరు ఏరై పారి
తడితగిలిన చోటల్లా
కత్తులు మొలకెత్తుతుంటే
ఏ పాశుపతాస్త్రం పనిచెయ్యదు !
భూమి గుండ్రంగా వుంది
జారుడు బండలా వుంది
ఉపరితలంనుండి అధోతలానికి
అధోతలం నుండి ఉపరితలానికి

అవకాశాన్ని బట్టి
ఆదాయాన్ని బట్టి
ఆపదను బట్టి
ఎటుబడితే అటు
జారుకోను అనువుగా వుంది!
పిల్లికి గంటకట్టను ఇన్నేళ్ళో
ఒక్క ఎలుకా ముందుకు రాలేదన్న భీమాన్ని
వమ్ముచేస్తూ
సాహసించి కదిలాయి
మరణాన్ని సమాధిచేసి!
సరళరేఖ వచ్చి చేరితేగాని
వక్రరేఖ నిర్మూలన జరగదు!

# ఎత్తుగడల పరంపర

అక్షరం అజ్ఞానాన్ని యిచ్చి
అరాచకాన్ని కొని తెచ్చి
జ్ఞానినీ అజ్ఞానినీ
అంధకారాన పడేశాక
సిగరెట్టు ముట్టించడానికి అగ్గిపెట్టెలా
జేబుల్లో బాంబులు చేరితే
రక్షణ
ఎదుటివాడి దాక్షిణ్యం మీదే!
మురికివాడల్లో
ఇరుకు సందుల్లో
క్షణకాలం వెలుగు నిలిచిన దాఖలాలేక
అందమైన వాడల్లో మేడల్లో
అద్దాల భవంతుల్లో అదెప్పుడూ నడుస్తూ
నిలకడగా నిలుస్తుంది!
ఈదిన సముద్రాల్ని లెక్కించక
ఈదడమే ఒకడి పనైతే
తాకిన ఆకాశపు అంచుల్ని కొలవక
తాకడమే మరొకడి నిర్వాహమైతే
లబ్ధి పరాన్నుల పరం!
నీడకోసం జెండా నీడను చేరి
బ్రతుకుదామని వెతుకుతుంటే
ఆర్థికబలం ఎత్తుగడలు మార్చి

అణగదొక్కే విద్య అరాచకానికి
దత్తతించగా
ఉల్లిపొరకంటే పలచనై
నూరో నంబరు పోగుకంటే తేలికై
నిలిచిన బ్రతుకుల
గోరీలు గాల్లోనూ
వీలునుబట్టి కాగితాల్లోనూ
కట్టబడుతుంటాయి !

# మనసే నీకు మృగ్యమైతే

నడకలు నేర్వని నిలకడ నీటిస్ఫూర్తితో కాదు
పరుగులుతీస్తూ
సెలయేరు ప్రవహించేది
పైనుండి కిందికి రాలే పండుటాకు ప్రేరణతో కాదు
పైకెళ్ళే బాణం
దూసుక వెళ్ళేది!
ఊపిరి ఉద్యమంతో మిళితమయ్యాక
ఉద్యమం ఊపిర్ని హృదిలో దాస్తుంది
ఊపిరిపై నువ్వు విసిరే బాణాన్ని
ఉద్యమం వెంటబడి తరుముతుంది!
మనిషే నీకు శత్రువైతే
మనిషి మనిషికీ
నువ్వు శత్రువువే
మనసే నీకు మృగ్యమైతే
మానవారణ్యంలో
నువ్వో మృగానివి!
కొండలు ద్రవీభవిస్తే
చరిత్ర గతి మారుతుంది
సముద్రాలు ఘనీభవిస్తే
లావా పొంగి పారుతుంది!
నా రక్షణకై
నీ చేత చేరిన తుపాకి

నాపై ముట్టడికి గురిపెట్టబడి వుంది!
తుపాకి రూపుదిద్దిన శిల్పిని నేను
అది నడకలు సరిగా నడవనప్పుడు
తగు మరమ్మత్తులు చేసేది నేను!
నీకు తుపాకి కాల్చడం తెలుసు
నాకు తుపాకీని కాల్చడం తెలుసు!

ఏనుగై ఘీంకరించి
అశ్వమై సకిలించి
పామై పగబట్టి
బీభత్సం సృష్టించి
ఇంటింటా మృత్యువును ప్రతిష్టిస్తాడు
అభిషేకం చేయిస్తాడు!
ఎప్పుడూ
వీరుడికి మృత్యువు ఆమడదూరం
భీతుడికి మృత్యువు జానెడుదూరం
పరాక్రమవంతుల్ని పడగొట్టను
పద్మవ్యూహం ఎత్తుగడే
దుష్టుల్ని శిక్షించను
ద్వంద్వయుద్ధం ఎత్తుగడే
ఏదీ
దుష్టశిక్షణ?
శిష్టరక్షణ?

# మరణానికి ముందు మరో జన్మ

పదునెక్కిన మెదడు
తను ఎక్కిన కొమ్మను నరుకుతూవుంది
విస్తరించిన ధృతరాష్ట్రి కౌగిలి
శకుని మామ సూక్తుల్ని వినిపిస్తూవుంది
గద్దెకెక్కిన బుద్ధి బలం
పెద్దల్ని పిన్నల్ని వేధిస్తూ వుంది
కాళ్ళకూ చేతులకూ దిగ్గొట్టిన ములుకుల్ని పీకి
గాయాల్ని మాన్పించుకొన్నా
మనసున నాటిన ములుకులు
సలుపుతూనే వున్నాయి!
ఎందుకు కోయిలా
ఎంతసేపూ గొంతు సవరించుకుంటూ
శ్రుతి చేసుకుంటూ
కుహూ...కుహూ...అంటూ పాట తుంచుకుంటావు
ఎన్ని ఋతువులకు పరదాలు తీశాను
ఎన్ని వసంతాలుగా ఎదురుచూస్తున్నాను
స్రవించే గాయం సృజించేలా
ఓదార్పు రేవున తేలేలా
జాగృతీ గట్టుకు చేరేలా
ఒక్కసారి పాడు కోయిలా...
తోటంతా నీది
కొమ్మల రెమ్మలన్నీ నీవి

గున్నమామిడి నునుచిగుళ్ళు
పొన్నమాను చిరుచిగుళ్ళు
నీ సొంతం చేసి
అంకితం చేసి
రాజ్యానికి రాజుని చేసి
మది పండిన వయస్సుతో
హృది పలిగిన మనస్సుతో
నీ ముందు కూర్చొని
ఎదలోంచి వెలువడని పాటకై ఎదురు చూడక...
జననానికి మరణానికీ మధ్య
నేను మరోసారి జన్మించాలని వుంది
అందుకు అమ్మ అండాశయంలో
పిండాన్నై పెరగాలని వుంది
అమ్మ ఒడిలో మళ్ళీ కళ్ళు తెరిచి
తమస్సు నిలిచినచోట
వయస్సు లేని పాట పాడుతూ
మూగబోయిన గొంతున
రాగాలాపన చేయించాలని వుంది !

# మజిలీ ఇచ్చిన మహోదయం

శూన్యంలోంచి శూన్యంలోకి నడవబోతూ
ఒక మజిలీ దగ్గర ఆగి వున్నాను
నా శూన్యం
ప్రస్థానంలో
జీవన పరిణామ దశ మార్పులోని ఒక మార్పులోకి
మనిషి మారిపోయాడు కోతిలాగా...
ఎన్నికల సమయంలో కులం
మాగాణీ మెట్టభూముల్లో విరగబడి కాస్తూంది
ఓటూ సారాయి ఒక్క తల్లి బిడ్డలయ్యాయి!
ఇంటికో ట్రాను సట్టింట్లో వేలాడుతూ
త్రాసుకో న్యాయం తూస్తూ వుంటే
చేతికో గడియారం కాలాన్ని కొలుస్తూ
గడియారానికో సమయాన్ని చూపుతూంది
విద్యను వేలిముద్రలు పహారా కాస్తున్నాయి!
ఓడలు వేసిన రహస్య రవాణా చాళ్ళలో
విజయవంతంగా వేల వేల పడవలు నడుస్తున్నాయి
గుడిసెలు పీసమెత్తుకూడ పెరక్కపోడానికి కారణం
మానవ కల్పిత భూమి ఆకర్షణే
ఆయుధాల భాష ఎక్కడైనా ఒక్కటే
గోవును చంపడంలో క్రూరమృగాలన్నీ ఐక్యతే!
నియాన్ లైట్ల వెలుగుల్లో తిరిగేవాడికి
సూర్యుడూ చంద్రుడూ ట్యూబులైట్లయితే

కిరోసిన్ కరువైన గుడిసెవాసికి
వెన్నెలే నియాన్ లైట్లు!
ప్రజాస్వామ్యం అంచుమీద నిలబడి వుండగా
అంచు తలవంచి లోయలోకి బిక్కు బిక్కుగా చూస్తూంది!
నాకు మరో దారి వుంది
అక్షరాల్ని కనపడకుండా వేలిముద్రలు అద్దుతూ
ఉన్న దారిని మూసి ఎవరో పహరా కాస్తున్నారు
ఆశయాలు వున్న వాడికి ఆయుధాలెందుకు ?
శూన్యానికి శూన్యానికి మధ్య నిలిచిననాకు
ఇది మజిలీ ఇచ్చిన మహోదయం !

# వినపడుతోంది నా పిలుపు

నా పిలుపు నీకు వినపడుతోందా ?
గాలినీ నీటినీ నెట్టి
సముద్రాల్ని
అడవుల్నీ తట్టి
ఎడారుల్నీ పర్వతాల్నీ చుట్టి
ప్రతిధ్వనిస్తోంది
సంవత్సరాల తరబడి
వందల వేల సంవత్సరాలుగా నిలబడి
నేను పిలుస్తూనేవున్నాను
చెంతనే వున్నా
నీ చెవికి చేరడంలేదా ?
మన మధ్య సమాంతర రేఖలు గీచి
సరిహద్దులు నాటి
మతోన్మాద జాతి విధ్వంసక ఉన్మాదులు
లౌకిక భావనా ఛిద్రకులు
మత కరాళ దాంష్ట్రి కిరాయి కసాయిలు
నీ ముందు వింధ్య పర్వతాల్ని పాతుతున్నారు
అగాధాలను అగడ్తలను తవ్వుతున్నారు
నీ చెవిలో చెట్లను పెంచుతున్నారు !
వారి పాశవిక వ్యూహరచనావలయంలో
మనల్ని మనమే ఉరేసుకొంటున్నాం
విచ్చుకత్తుల్తో హత్యచేసుకొంటున్నాం

పైగంబరులం దిగంబరులమై కాల్చుకొంటున్నాం!
మనిషిని మనిషి చంపుకొనే మన పోకడలు
మతమే బ్రతుకనే మన ఆరాధనలు
ప్రపంచానికి నవ్య ప్రభోదాలై నిలిచాయి!
నా పిలుపు నీకు వినపడుతోందా?
నీ ప్రతిస్పందన కనబడకుండా వుంది
వెలుగులో గుడ్లగూబలా గూటిలో నక్కి కూర్చుంటావు
చిత్తడిలో తడిసిన అగ్గిపుల్లలా
సహాయ నిరాకరణ చేస్తుంటావు
మనం రెండు నీటి బిందువుల్లా కలిసిపోవాలి
ఏ శాస్త్రజ్ఞుడికీ
ఏ పరిశోధనకీ
అందనంత
అందుకోలేనంత
అర్థంకానంతగా
అరేబియా హిందూ మహాసముద్రంలా సంగమించాలి!

# విజయకేతనం దిశల్లో

నా బ్రతుకు వాడిముందు రాయని కాగితం
అందులోనూ
అన్నిటికీ సమ్మతిస్తూ
అట్టడుగున నే చేసిన సంతకం
ఘజనీ మహ్మాదులా నాకు పట్టుదల వుంది
కాని అన్నిసార్లు దండెత్తి ఓడిపోవడానికి
నా మనస్సు అంగీకరించకుండా వుంది!
నా జీవం బడుగు జీవుల రుధిర క్షేత్రంలో బిందువు
దానికి దర్పణం హరిత విప్లవాల
పంటపొలాల పసిరిక భూములూ...
నా బ్రతుకు ఎడారిలో నిత్యం మాడుతున్న
ఇసుక రేణువుల మధ్య ఒక రేణువు
ఎన్నడూ వొంటిపై తడి కప్పుకోలేని అణువు
ఆకాశ హార్మ్యాల సముదాయాల పంక్తుల్లో
కాంతులు నింపడానికి
బుడతకీచులమై నిచ్చెనలు వేస్తుంటాము!
రోజూ కుక్కపిల్ల అగ్గిపుల్ల ప్రతాపాలు చూసి
సబ్బుబిళ్ళ గంధపుచెక్క సౌరభాలు పీల్చి
చాకిరి చేసిన అవయవాలు ఆదమరిచి సేదగొంటే
ఎదురుతిరిగిన పేగులకు ఎంతచెప్పినా వినక
ఆందోళనకై అప్రమత్తమై నిలవగా
పడకచుట్టూ నాగులు పడగలెత్తాయి!

మునిగిన వస్తువు ఘనపరిమాణం బట్టి
అంత పరిమాణం నీరు వెలువడుతుంది
నా మీద పడే వొత్తిడిని బట్టి
అంతశక్తి పైకి ఉబుకుతూ వుంది
ఘజనీ మహ్మాదులా
నాకు పట్టుదల వుంది
అన్నిసార్లు దండెత్తి ఓడిపోవడానికి
నా మనస్సు అంగీకరించకుండా వుంది !
ఉబికే శక్తుల్ని కూడగట్టుకొని
ఒక్కసారిగా విజయకేతనం
తిరుగుబాటు నేలలో
ఎగరెయ్యాలని వుంది !

# మరోళన్యాయం

తూర్పు మార్పును
సూచిస్తున్నా...
తూర్పు చేరిన వాళ్ళంతా
మార్పుకోరే వాళ్ళుకాదు!
మనిషిని —
గాయం జ్ఞానిని చేస్తే
ఎండమావు అన్వేషిని చేస్తే
అన్యాయం వీరుడ్ని చేస్తుంది!
పంచాయతీ మెంబరు మొదలు
పార్లమెంటు మెంబరు వరకు
మనకెందరు దైవాంశ సంభూతులు?
గుండెనూ గుండెనూ
చూపునూ చూపునూ
అణువణువునా విడదీసే
ఇనుపతెరలు వీళ్ళు!
డబ్బునూ డబ్బునూ
పెదవినీ పదవినీ
అణువణువునా కలిపే
ఆహ్వాన ద్వారాలు వీళ్ళు!
రుధిరం కాళ్ళకు తగిలితే
నడుస్తున్న వాళ్ళంతా
అడుసులా కడుక్కోరు

మనిషి ఒంటరి కాదు
గుండె అతని జంట!
ధనం అన్నిటికీ
పరమౌషధం కాదు
పాలు పోస్తే పువ్వు పుష్పించదు
నీరే దానికి దివ్యౌషధం!

# మేఘం వేసుకొస్తున్న మరణం

మేమున్నామని మిమ్మల్ని మాకు గుర్తు చెయ్యడానికి
మీ ఉనికికి భయపడి మేము భీతితో బ్రతకడానికి
రండి! మేఘమాలికల్లారా!
ఇది మీకు యుక్తమైన సమయం!
ఏయే వేళల్లో
ఎలా ఎక్కడ కురవాలో అక్కడ అలా కురిస్తే
మీ అవసరాన్ని ఆధిక్యతని ప్రాముఖ్యతని ఎవరు గుర్తిస్తారు?
సమయంకాని సమయంలో
అపరకాళిలా విజృంభిస్తేనే
అందరి మనసుల్లోనూ
మరణ సంకేతంలా ముద్రించబడతారు!
పరుగుపందెంలో సముద్రుడు తిరుగులేని క్రీడాకారుడై
చెలియలి కట్టకు తలబాదుకొని
కాళ్ళను నరుక్కొని కుప్పలా కూలిపోతున్నాడు
అధిగమించను ఎన్ని ప్రయత్నాలు చేసినా వ్యర్థమవుతున్నాయి
మీరు కురిసి
గాలితో కలిసి
సముద్రం ఉప్పొంగి చెలియలికట్ట దాటితే
పరుగుపందెంలో ప్రజలందరికీ పరాజయమై
సముద్రుడికే దక్కుతుంది స్వర్ణపతకం!
గుడిసెలన్నీ గొంతెత్తి పాడుతున్నాయి
కుంభవృష్టిగా కురిసి వరదలై పారి

ఎలుగెత్తిపాడే గొంతులన్నీ
ఏటి నీటిలో కలవాలి!
అందరి ముఖాన ఆశారేఖలుగీసి
ఆనంద పౌలిమేర్లకు విషాదాన్ని తరిమి
రైతే రాజని చాటిన హాలికుల్ని
వరదలోముంచి వారి ముఖాన విషాద రేఖలు గీసి
బ్రహ్మరాసిన కర్మరాతలని బోధించాలి!
ప్రజలు తిరస్కరించిన ప్రజాపీడకులు
తుఫాను మరణాలపై శోకాలు కురిపించి
ఎండిన చేతుల నిండా
సైక్లోన్ రిలీఫ్ ఫండు దండుకొని
వచ్చే ఎన్నికల్లో ప్రజోద్ధరణకై పాటుపడాలి
మేఘమన్నా
వర్షమన్నా
మరణ సంకేతమని
మానవజాతి భీతిచెందాలి!
మహాత్ముని మహోన్నత చరిత్ర
గాడ్సే అమానుష పాత్ర
ఒకే కాన్వాసుపై చిత్రించబడ్డాయి
రండి! మేఘ మాలికల్లారా రండి!
మేమున్నామని మిమ్మ మాకు గుర్తు చెయ్యడానికి
మీ ఉనికికి భయపడి మేము భీతితో
నిద్రలేమితో గడపడానికీ!

# పుడమి తల్లికి పుత్రుల పంట

నగారా మోగుతుంది
రా చెల్లీ ! రా తల్లీ !!
కలలు పండను
ఆశలు నిండను
తల్లి చెర విముక్తికి
తండ్రి తల కొరివికి
పుత్రుల్ని ప్రసవిద్దాం!
మానని గాయంపై మరో కత్తివేటు వుండదు
కన్నీటి సుడిగుండాల్లో కనుమూయడం జరగదు
చిరకాల చిత్రహింసకు అమృత భాండం ఉద్భవించింది
హృదయజ్వాలను హిమపాతం చుట్టుముట్టింది
మనఃక్లేశాన్ని వెన్నెల సోన తరుముకెళ్ళింది
పుట్టబోయేది
పుంలింగమా
స్త్రీ లింగమా
పుట్టకముందే దుర్బిణీ వేసి
పుట్టకుండా చేసే ప్రక్రియ పిలుస్తోంది
భయం గుప్పెట్లో బ్రతుకులు ఈడ్చే పనిలేదు
కట్నాల మంటల్లో శలభాల్లా మాడనక్కర్లేదు
నూతిలో, గోతిలో
అగ్నిలో ఆహుతయ్యే
ఆత్మహత్యా పర్వాలుండవు

క్షిప్తత, స్తబ్ధత
నిస్తేజం, నిరాసక్తి ఎందుకు ?
ఇన్నేళ్ళ ఛీత్కారానికి
ఏహ్యానికి ఇదే వీడ్కోలు
అత్తా మామల ఆరళ్ళు
ఆడపడుచుల ఎత్తిపొడుపులు
కట్టుకున్న వాడి యమహింసలు
ఇక స్వస్తి!
లింగ నిర్ధారణకు
స్కానింగ్ సెంటరు వెలసింది
స్త్రీలింగం విసర్జించి
పుంలింగం ప్రసవించి
కోరికల్ని కట్నాలతో నింపుకొని
కానుకల వ్రాసులే చెప్పుకొందాం
పుత్రుల్నే ప్రసవిద్దాం!
రా చెల్లీ! రా తల్లీ!!
నగారా మోగుతుంది!

# అసమర్థుని ఆరోప్రాణం

సమర్థుడి పడగ కింద పండుకొన్న వాడివి
అసమర్థత ఒంటికి కప్పుకొన్న వాడివి
నువ్వు సమర్థుడవైన అసమర్థుడివి!
అసమర్థత ఆత్మహత్యకు అంకితం
అది
అగరువత్తయి ఆత్మాహుతి చేసుకొంటుంది
కర్పూరమై నైరూపిగా మార్చుకొంటుంది
వ్యతిరేకతే ఎదుటివాడి ప్రయోగమైనప్పుడు
ఎన్ని శ్వేతపత్రాలు ప్రకటించినా
ప్రయోజనం వుండదు
సాహసం జీవితాన్ని మోసుకొంటూ సాగితే
సమర్థత మేనాలో
స్వాగతం పలుకుతుంది!
పురివిప్పి ఆడే నెమలి నృత్యం వెనుక
పడిలేచిన అనుభవాల అభ్యాసం వుంది
భీకరారణ్యాన బ్రతికే
లేడి బెదురు కళ్ళ వెనుక
క్రూరమృగాల నిత్య వేధింపు వుంది
సముద్రానికి ఆ హంగూ పొంగూ
నదులు యిచ్చిన నిర్వాహకమే!
కన్నీళ్ళతో సేద్యం చేస్తున్నవాడు
నీ సుఖాన్ని ఎన్నడూ కోరనివాడు

భయంతో భూమి మీద నడుస్తున్నప్పుడు
నీ భావాలకు తగిలిన ప్రకంపనాల్ని
నువ్వు బొత్తిగా గమనించడం లేదు!
అసమర్థుని మరణం అడుగడుగున
సమర్థుడి మరణం చిట్టచివరన
అసమర్థత సమర్థుడు కప్పిందేగాని
నీకై నువ్వు తొడుక్కున్నది కాదు!
అసమర్థుడికి భయం ఆరో ప్రాణం
అది పంచ ప్రాణాలపై
స్వారీ చేస్తున్న మరో ప్రాణం!

# సముద్రఘోష

ఉదయించిన సూర్యుడికీ
అస్తమించడానికి ఓ కాల పరిమితి వుంది
అలా మానవుడికీ వుండాలనడానికి
నేనింకా కోమాలోకి జారుకోలేదు
పుట్టిన పిందెలన్నీ
పళ్ళుగా మారుతాయని నేననుగాని
వేసిన మొగ్గలన్నీ పూతగా
రాలడం చూస్తేనే మనసు క్షోభించేది
లేచిన అల చెలియలికట్ట చేరకుండా
సమాధి అయితేనే హృదయం ద్రవించేది!
మిత్రుడు చనిపోయాడని నేనందుకొన్న టెలిగ్రాం
ఆకాశమై
నా మీద పడిన బరువుకు నా వూపిరి ఆగి సాగింది
సాంఘిక సంస్కరణల్లో ముందుండి నడిపించడం
సాంస్కృతిక కార్యక్రమాల్లో ప్రథముడై గెలుపొందడం
నా మిత్రుడి సొత్తు
అతన్ని అభినందించడం
అనుసరించడం నా వంతు!
వైవాహిక వసంత కాలంలో
రెండు వసంతాలు కూడా నింపుకోనిమిత్రుడు
పిందెగా రాలుతాడని
ఏ కాయ పండూ వూహించలేదు!

బస్సూ రైలూ నా మనస్సు ముందు కాలినడకలై
నన్ను మిత్రుడి శవం వద్దకు చేర్చాయి
నన్ను చూసి ఇల్లు గొల్లుమంది
అల్లుకొన్న మమతలు దుఃఖంలో మునిగున్నచోట
మనిషికి మనిషికీ పలకరింపు ఏడుపే
ప్రయాణంలో కన్నీరంతా ఖర్చు చేసుకొన్న నాకళ్ళు
ఎండిన చెరువుల్లో మెరిసే గవ్వలయ్యాయి
జరుగుతున్న కార్యక్రమం చూశాక
శవాన్ని సాగనంపడానికి ఆఖరి ఘడియలు
ఆసన్నమైనట్లు గోచరించాయి
తమ్ముతాము అదుపు తప్పి విలపిస్తుంటే
భర్త ప్రక్కన పడి రోదిస్తున్న
భార్యను ఎవరు ఓదారుస్తారు ?
ఇంతలో
మిత్రుడి తీపిగుర్తు
వసంతం నిండని ఉదయ భాస్కరుడు
ఏడుస్తూ, దోగాడుతూ
పడి రోదిస్తున్న తల్లి పక్కకుచేరి
పైట లాగి పాలిండ్ల కోసం వెతగ్గా
చూసిన కళ్ళు నదులయ్యాయి
ఇల్లు సముద్రమైంది
సముద్రం ఘోషిస్తుంది
బంధం భవిష్యత్తులోకి లాక్కెళ్ళింది !

# ప్రత్యాసనం

ఆ రోజు ప్రభాతం నాకు మామూలు ఉదయంగా లేదు
వేయి మంది ఆదిత్యులు వెలుగు రథాలెక్కి
ఏడు వేల గుర్రాలతో పరుగెత్తి వచ్చిన రోజు!
ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవాన
నిస్వార్థ స్వాతంత్ర్య సమర యోధుని గుండెలా
మొదట చంద్రుడ్ని జయించిన
సాహసి నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ మనస్సులా...
నా హృది మది పింఛై తేలిపోతోంది!
ఇన్నేళ్ళూ సాధించిన ప్రథమ తరగతి పట్టాలూ
బంగారు పతకాల అలంకరణలూ
నాకు మకుటం పెట్టబోతున్నాయి
ఉద్యోగ పట్టాభిషేకం చెయ్యబోతున్నాయి
నా మొదటి ఇంటర్వ్యూ స్వర్గంలోకి యక్షుడనై నడచి...
మౌఖిక పరీక్షకై మాన్యుల ముందు కూర్చున్నాను!
గోదావరి వరద ప్రమాద సూచిక తాకినపుడు
కూనవరం వద్ద నీరు ఎన్ని క్యూసెక్కులు?
నార్వా దేశపు వార్షిక రక్షణ వ్యయమెంత?
శ్రావణ మేఘం అత్యధిక వేగమెంత?
జెముడు కాకి జీవనకాలమెంత?
దేశంలో జోగినుల శాతమెంత?
ఈ ప్రశ్నల కూడికలన్నీ కలసి
తీసివేత కార్యక్రమాన్ని చేబట్టాయి

ఆశ్రితుల సంక్షేమం కోసం
అధికారుల ఎత్తుగడ ఖేదంగావుంది
కురు సభలో దిక్కుతోచని ద్రౌపదిలా
దీన బాంధవుడికోసం నేను చేతులెత్తగా
ఎత్తుగడతో యుక్తిగా నన్ను ఇంటిదారిపట్టిస్తే
తేరుకోలేనంతగా తగిలింది విద్యుత్ ఘాతం
ప్రసూతి వైరాగ్యం బారసాలతో సరనుకొని
ఆశయ సిద్ధికోసం అడుగు ముందుకు వేశాను !

# మరణం పరిచిన తివాసి

ఉష్ణోగ్రతలా నా వూపిర్ని కొలిచిన డాక్టరు
రహస్యంగా నీ చెవికి చేర్చిన వార్త
సుడిగాలై నన్ను తాకింది నాన్నా
ఇరవై నాలుగు గంటల్లో కీర్తి శేషుడిగా
కాలమానం
నన్ను కొలవబోతున్న విషయం
నాకు తెలిసింది నాన్నా!
పరీక్ష రాసే ప్రతిభావంతుడికి
కాలం కలకండలా కరిగిపోతుంది
మరణం తివాసి పరిచిన వాడికి
ఎదురుచూపు యుగమై నడుస్తుంది!
మన బ్రతుకు
ఇసుకలో ఇనుపచక్రాల బండి ప్రయాణం
శ్రమ నిమజ్జనానికి
పైకి పొంగిన ఫలితానికీ పొంతన వుండదు!
వెలవని నిండు కుండైన నీ కళ్ళు
ఒక్కసారిగా ఇరబడి పోతాయనీ...
వర్షించే అమ్మకళ్ళు
ఉప్పెనై ముంచుతాయని భయంనాకు!
ఎందుకు నాన్నా నాకు మందులు
చెరువులో ఇంగువ కలపడం
సముద్రాన ధూపం వెయ్యడం!

పండై రాలడం కన్న
కాయగా కొయ్యబడ్డం మిన్న
కానీ
ఆదివారం కాలేజీకి సెలవైె యింటికి వచ్చినా
అనారోగ్యం పాలై సెలవు మీద వచ్చినా
పరీక్ష వ్రాసయ్యావా బాబూ అనడిగిన అమ్మ
అమాయకత్వంలో ఆదమరచి
హాయిగా నిద్రించాలని వుంది!
కొత్త పుస్తకాలకు అట్టలు వేసి
రంగు రంగుల లేబుళ్ళు అంటిస్తూ
నాకు బదులు నువ్వే బడికెళ్ళే వాడిలా
ఆనాటి నీ ఉరుకుల పరుగుల
ఉత్సాహం తలుచుకొంటే
చావంటే నాకు భయంగా వుంది నాన్నా!
నేను శ్రీకృష్ణుడ్ని కాలేనుగాని
కాలానికి చక్రం ఒడ్డి
చిరంజీవిగా
మీ ముందు నిల్చిపోవాలనుంది నాన్నా!

# ఆమె చూపు నీరౌతుంది

అర్ధరాత్రి పోలీసులు వీధి వెలుగుపై లాఠీచార్జి చేసి
చీకట్ని దింపి
ఇంటిని ముట్టడించి
అమానుష క్రియలతో
అదృశ్యం చేసిన తన బిడ్డ జాడను
ఏ దృశ్య హస్తమో
అదృశ్య హస్తమో
అశరీర వాణో
వేళగాని వేళలో
అపరాత్రి వేళలో
మోసుకొస్తుందని
ఆమె ఇంటి ముందు కూర్చొని చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ ఆమె చూపు నీరౌతూ వుంటుంది !
బడికి హారం వేసి తల్లి చేతుల్లోంచి
పాదరసంలా జారిపోయే పిల్లాడ్ని ;
గోధూళి వేళ గంగడోలు చిరునవ్వుల్ని
మోగించుకొంటూ పాలు తాగే లేదూడల్ని ;
మసక చీకట్లో గూటికి చేరి
రెక్కలు రాని బిడ్డల్ని రెక్కల్లో దాచుకొనే పక్షుల్ని
ఆమె చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ ఆమె చూపు నీరౌతూ వుంటుంది !
బస్సూ రైళ్ళ చప్పుళ్ళు

ఆమె ఆశకు చిగురులు తొడుగుతుంటాయి
కదిలిన ఆకునూ
కదిలించిన గాలినీ
కబురును అడిగి
పిలవని పిలుపు వెంట
పిలుపుకు అందనంత దూరం
ఆమె వెళ్ళిపోతూ వుంటుంది !
ఉదయాన పోస్టుమేన్ ఆశల పల్లకీ మోసుకొచ్చి
ఇంటింటా ఆపి
తన ఇంటి ముందు ఆగకుండా సాగడం
ఆమె చూస్తూనే వుంటుంది
అప్పుడప్పుడూ ఆమె చూపు నీరౌతూ వుంటుంది !

[1990 లో రాష్ట్రస్థాయిలో మహాకవి శ్రీశ్రీ
స్మారక అవార్డు పొందిన కవిత]

# మొలకెత్తిన విత్తనం

ఒక చెట్టు అరణ్యం కాదు
ఒక బొట్టు సముద్రం కాదు
ఒక్క మనిషి సమస్త భూగోళం!
ఒళ్ళంతా కాయలు కప్పుకొన్న చెట్టు
ధరణికి భారం కాదు గాని
తనను తాను భారమై చేతులు చాచి
భూమిని చేయూత కోరుతుంది!
చెట్టు కాయల్ని తాకి
గుట్టలు గుట్టలుగా తెగిపడ్డ
కాళ్ళూ, చేతులూ, పెదాలూ
ఇసుక మేటలై పేరుకపోగా
చెట్టుకింద తెగిపడ్డ
అవయవాల కోసం
ఒక్కరూ వచ్చి
స్వాగతం పలికిన పాపాన పోలేదు!
ఎన్నో గాయాల్ని కలుపుకొంటే
నేడు ఒక నిండు జీవితం
ఎన్నో అవయవాల్ని రాల్చుకొంటే
ఒక పూర్ణ శరీరం
నిన్నటికి నిన్న
చెట్టుకాయలన్నీ యజమాని ఇంటికి చేరగా
కాటికి కాళ్ళుచాచిన

కొమ్మలన్నీ ఒక్కసారి
కొత్త పార్టీ జెండాలై లేచి ఎగరగా
నేటికి నేడు
యజమాని చేతులూ, పెదాలూ
తన ఇంటిముందే
తెగిపడి వుండడం చూసిన
కొన్ని కళ్ళు ఆశ్చర్యాన్ని కప్పుకోవడం
కొందరికి ఆశ్చర్యాన్ని కలిగించలేదు !

[1991 లో మహాకవి శ్రీశ్రీ 8వ వర్ధంతి సందర్భంగా
జాతీయస్థాయిలో ప్రథమ బహుమతి పొందిన కవిత]